# వేదాంత వ్యాస రత్నావళి



రచన:

వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి

# వేదాంత వ్యాస రత్నావళి





రచన:

వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి

ప్రథమ ముద్రణము :
ఏప్రిల్ 1991
కాపీలు 1000

ద్వితీయ ముద్రణము :
ఫిబ్రవరి 1996
కాపీలు 1000
ప్రింట్ 2001
ఫిబ్రవరి
కాపీలు 1000

మూల్యము రు. **8-00**

ప్రాప్తిస్థానము :
వి. ఎల్. నారాయణశాస్త్రి
లలితా విద్యామందిరము,
కేదారేశ్వరపేట,
విజయవాడ - 520 003.

# ఆ ము ఖ ము

# ఆవేదన - నివేదన

సనాతనమయిన భారతీయ సంస్కృతి ఎన్నియో కష్టనష్టములను అనుభవించుచు ఈ నాటికిని తన శాశ్వతత్వమును నిరూపించుకొను చున్నది. ఈ సంస్కృతిని గురించిన లోటుపాటులను గాంభీర్యమును గుర్తించలేనివారు నేడు దానిని నిరసించుచున్నారు. అనాగరిక మయిన నాగరికత కారణమున పతనోన్ముఖు లగుచున్నారు. అట్టి స్థితిని చూచిన సహృదయులందరు ఆవేదన చెందుచున్నారు. ఆ యావేదనతోనే ఈ వ్యాసములు సంక్షిప్తరూపమున వ్రాయబడినవి.

ఇందుగల వ్యాసములలో మొదటిదగు పాపపుకొండలు అను వ్యాసమున కిరాత చర్యలచే ధనసంపాదన చేయతలచినవారిని గురించి ప్రస్తావించబడినదియేగాని సన్మార్గమున ధనసంపాదనచేయు సత్పురుషుల గురించి కాదని నివేదించుకొనుచున్నాను. అటులనే అబలా సబలా అను వ్యాసమునగూడ స్త్రీల స్వాతంత్ర్యము అను పేరుతో కొందరు చెప్పుచున్న మాటలువిని పరిపక్వమైన మానసికస్థితి లేనివారు పెద్దలను ఎదిరించి కష్టముల పాలగుచున్నారు. అట్టివారిని గురించియే అందు తెలియచేయ బడినది. కాని ఆత్మాభిమానముతో జీవించు అందరిని గురించియు కాదని నివేదించు కొనుచున్నాను.

ఇందుగల వ్యాసములన్నియు సమాజమునకు అంతో ఇంతో శ్రేయస్సును కలిగించునను యుద్దేశముతో వ్రాయబడినవి. గాని ఎవరిని కించపరచుటకు కాదని నివేదించుకొనుచున్నాను.

ఈ గ్రంథమునకు సహాయపడిన ఉదారులు :

1. డా॥ యన్. శ్రీనివాసశాస్త్రి,
2. యమ్. ఆర్. ప్రసాద్
3. బుర్రా శివరామకృష్ణశర్మ,
4. కుప్పా నాగభూషణశర్మ,
5. చింతలపాటి శివరామకృష్ణ.
6. బి. విశ్వనాధరావు

మరియు తదితరులు అందరకు ధన్యవాదములు.

వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి

# వేదాంత వ్యాస రత్నావళి

## ప్రశంస

డా॥. ఎ. సుబ్రహ్మణ్యశాస్త్రి
హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంట్ ఆఫ్ తెలుగు,
ఆంధ్ర యూనివర్సిటీ,
విశాఖపట్నం - 530 003.

10-10-93

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ వేదమూర్తులయిన బ్రహ్మశ్రీ వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి గురుపాదులకు నమస్సుమనసా2ంజలి. ఉ॥ క్షేమపూర్వకముగా తాము ఆదరముతో నొసగిన "మనువు-మానవ ధర్మములు" "వేదాంత వ్యాస రత్నావళి" అను గ్రంధములు రెండును అమూల్య గ్రంథములు సాంతము పఠించితిని.

నిత్య జీవితమునకు పరమావశ్యకములయిన మనుస్మృతిలోని ప్రధాన విషయములను వివరణ పూర్వకముగ లోకమున కందించిన మీకు హార్దిక కృతజ్ఞతాభివందనములు. లోకము మీ ఋణము తీర్చుకొన జాలదు. సర్వమానవజీవిత సముద్ధరణకు ఈ గ్రంథము పరమోప కారకము. భిన్నభిన్న విషయములను గైకొని సులభసుందరముగ వేదాంత వ్యాసరత్నావళిని మీరు రచించుట అత్యంత ప్రశంసార్హము. సుఖము శారీరకమా, మానసికమా, అద్వైతము అంతుపట్టని విషయమా, మోక్షం అంటే ఏమిటి, నిత్యానందము అను వ్యాసములు ఆణిముత్యములు మీవంటి పండితులు లోకమునకు తప్పక అందించవలసిన విషయములు అని, హృదయపూర్వక కృతజ్ఞతలు.

వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి

# వేదాంత వ్యాస రత్నావళి

## ప్రశంస

డా॥. ఎ. సుబ్రహ్మణ్యశాస్త్రి
హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంట్ ఆఫ్ తెలుగు,
ఆంధ్ర యూనివర్శిటీ,
విశాఖపట్నం - 530 003.

10-10-93

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ వేదమూర్తులయిన బ్రహ్మశ్రీ వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి గురుపాదులకు నమస్సుమనసాంజలి. ఉ॥ క్షేమపూర్వకముగా తాము ఆదరముతో నొసగిన "మనువు-మానవ ధర్మములు" "వేదాంత వ్యాస రత్నావళి" అను గ్రంధములు రెండును అమూల్య గ్రంథములు సాంతము పఠించితిని.

నిత్య జీవితమునకు పరమావశ్యకములయిన మనుస్మృతిలోని ప్రధాన విషయములను వివరణ పూర్వకముగ లోకమున కందించిన మీకు హార్దిక కృతజ్ఞతాభివందనములు. లోకము మీ ఋణము తీర్చుకొన జాలదు. సర్వమానవజీవిత సముద్ధరణకు ఈ గ్రంథము పరమోప కారకము. భిన్నభిన్న విషయములను గైకొని సులభసుందరముగ వేదాంత వ్యాసరత్నావళిని మీరు రచించుట అత్యంత ప్రశంసార్హము. సుఖము శారీరకమా, మానసికమా, అద్వైతము అంతుపట్టని విషయమా, మోక్షం అంటే ఏమిటి, నిత్యానందము అను వ్యాసములు ఆణిముత్యములు మీవంటి పండితులు లోకమునకు తప్పక అందించవలసిన విషయములు అని, హృదయపూర్వక కృతజ్ఞతలు.

వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి

# వేదాంత వ్యాస రత్నావళి

## 1. పాపపు కొండలు

ఆదికవియైన వాల్మీకి మహర్షి బాల్యమునందు కిరాతుల సాంగత్యముకలవాడై జీవించుచుండెను. అతను కిరాత వనితను వివాహమాడి ఆమెయందు సంతానమును గని వారి పోషణమునకై అరణ్య మార్గమున వెళ్ళు బాటసారులను బాధించుచుండెను. వారి సొమ్ములను కాజేయుచుండెను. ఈ విధముగా చాలాకాలము గడిచెను.

అతని భాగ్యవశమున ఆ మార్గమున వెళ్లుచున్న సప్తమహర్షులు అతని కంట పడిరి. ఆ కిరాతుడు వారినికూడా నిర్బంధించెను. వారు అతని దుఃస్థితినిచూచి జాలిపడి యిటుల ప్రశ్నించిరి. నీవు ఈ విధముగ బాటసారులను బాధించుటచే మహా పాపమును సంపాదించుచుంటివి. పెరిగిపోయిన ఆ పాపపు కొండలు చూడుము- అని పాపపు కొండలు చూపిరి. అదిచూచిన కిరాతుడు భయముచే చలించిపోయెను. ఇది అంతయు నీ యాలుబిడ్డల నిమిత్తము చేయుచుంటివిగదా. నీ ధనమును అనుభవించుచున్న నీ యాలుబిడ్డలు నీ పాపములో భాగము పంచుకొందురేమో ఆలోచించితివా? అటుల ఆలోచించనిచో వారిదగ్గరకు వెళ్ళి ఈ ఈ విషయము తెలుసుకొని రమ్ము. మొదట ఆ కిరాతుడు ఆ ఋషులను మోసగాండ్రని తలచెను. పిమ్మట విషయమును తెలుసుకొన దలచినవాడై వారిని చెట్టుకు కట్టివేసి తనవారివద్దకు వెళ్ళి విషయమంతయు చెప్పి తన పాపములో భాగమును పంచుకొందురా యని ప్రశ్నించెను. అందులకు వారు సంపాదించి పోషించటం నీవంతు. నీవు ఎటుల సంపాదించితివో మాకు తెలియదు. అందువలన పాపములో భాగము మేము స్వీకరించము అని కఠినముగా చెప్పిరి. ఆ మాట వినినవెంటనే కిరాతుడు నిశ్చేష్టుడయ్యెను. శరీరమంతయు చెమటలు గ్రమ్మెను. పరుగు పరుగున

మహర్షుల సమీపమునకు వెళ్ళి వారి పాదములపై బడి తనకు పాపవిమోచనము కలిగించవలసినదని ప్రార్థించెను. వారు రామ మంత్రమును వ్యత్యస్తముగా 'మరా' యని యుపదేశించిరి. నిశ్చయ బుద్ధితో ఆ మంత్రమును జపించిన కిరాతుడు వాల్మీకియై ఆది కవియై మనకందరకు తరణోపాయము చూపించెను.

ఇది యంతయు పరంపరగా వచ్చుచున్న వాల్మీకి మహర్షి సంగ్రహ చరిత్ర.

మహర్షులు వాల్మీకికి పాపపు కొండలు చూపిరిగదా. మనము కూడా కాస్తో కూస్తో పాపము చేస్తున్నాముగదా. మనకా కొండలు కనిపించుటలేదు. కనిపింపచేసెడివారుకూడా లేరు. మరి మనకు ఆ కొండలు కనిపించు ఉపాయము కలదా అని ఆలోచించతగిన విషయము.

ఒకరోజున ఒక జిజ్ఞాసువు ఇటుల ప్రశ్నించెను. దేవుడున్నాడని చెపుతారు. ఉంటే కనిపించడేమని. నేను సమాధానము చెప్పితిని - కనిపించుచునేయున్నాడు. మీరు చూచుచునేయున్నారు. చూచిగూడా కనిపించలేదని పొరబడుచున్నారు- అని. అందులకు ఆయన ఆశ్చర్యపడి ఏదీ నాకు కనబడుటలేదే యనెను. నేను చెప్పితిని 'తాభి రష్టాభి రీశః' అని కాళిదాసు చెప్పెను. పంచభూతములు సూర్యచంద్రులు పురుషుడు ఈశ్వరుని స్వరూపులుగదా. అవి కనిపించుచునే యున్నవిగదా. అందులకు అతడు, అవును దేవుడు ఆయా స్వరూపములలో కనిపించుచున్నాడని అంగీకరించెను. అటులనే మనకు పాపపు కొండలు ప్రతి నిత్యము కనిపించుచునే యున్నవి. కాని మనము కనిపించుటలేదని పొరబడుచున్నాము. అయితే అవి ఎటులుండునో ముందుగా తెలుసుకొన వలయును.

అందులకు ముందు పాపమనగానేమో తెలుసుకొనవలయును. 'పాపాయ పరపీడనం' అని శాస్త్రము. ఇతరులను పీడించుటయే పాపము.

మనము సంపాదించిన స్థిరచరాస్థులు ఎన్నియో గలవు. అవి మనకు నిత్యము ధన రూపములో, బంగారము రూపములో, పశువుల రూపములో, పొలముల రూపములో, వాహన రూపములో, మేడల రూపములో కనిపించుచున్నవి. ఇవి యన్నియు మనకు ఎటుల లభించినవి? మనము చేసిన వ్యాపారముల వలననో, వ్యవసాయము వలననో, ఉద్యోగము వలననో, లంచగొండితనము వలననో, చౌర్యము వలననో లభించియుండునేగాని మనము కేవలము చెట్టు క్రింద ముక్కుమూసుకొని తపము చేయుటవలన మాత్రము లభించలేదు. అవి మనము చేసిన కర్మల ఫలితముగా లభించినవి. మనము పరిశ్రమలు చేయు సమయమున మనకు తెలియక పోవచ్చును గాని ఆ పరిశ్రమల ఫలితములుగా మనకు లభించిన ఈ భోగములన్నియు పాప ఫలితములేయని గుర్తించవలయును. మనకు లభించిన సంపదలనుచూచి సంతసించుచున్నామేగాని ఇవి అన్నియు ఆనాడు కిరాతకునికి కన్పించిన పాపపు కొండలని తెలిసికొనజాలకున్నాము. మనము సంపాదించిన సంపదను మన ఆలుబిడ్డలు అనుభవింతురేగాని మన పాపమును మాత్రము అనుభవించరు. ఈ విషయమునే మహర్షియైన మనువు ఇట్లు చెప్పెను.

ఏకః ప్రజాయతే జంతుః ఏకఏవ ప్రలీయతే ।
ఏకో2నుభుంక్తే సుకృతం ఏకఏవ చ దుష్కృతమ్ ॥

అనగా జీవి ఒకడుగా పుట్టును, ఒకడుగా చనిపోవును. తన పాప పుణ్యములను ఒకడుగానే యనుభవించును.

తాము చేసిన పాపముల పరిహారమునకు రామనామ జపము యొక్కటే శరణ్యము.

—(౦)—

## 2. అబలా ? సబలా ?

ప్రాచీన కాలమునాటి గ్రంథములయందు స్త్రీలను అబలా అను శబ్దముతో వ్యవహరించటం జరిగింది. దానికి కారణం ధర్మ శాస్త్రకారులు స్త్రీ పోషణయందు రక్షణయందు కూడ పురుషులకు తగిన శ్రద్ధ వహించ వలసి యున్నదని నొక్కివక్కాణించటమే. ఆ శాస్త్ర విధులను విశ్వసించిన పురుషులు స్త్రీల విషయమున తగిన శ్రద్ధ వహించారు. బాల వృద్ధులతో సమానముగా స్త్రీలనుగూడా ఎట్టి సమయమందును చంపరాదని తలచారు. యుద్ధ సమయములందు గూడా స్త్రీని చంపుట మహా పాతకమని చెప్పి నారు. ఈ విధముగా స్త్రీల విషయమున పురుషుల కర్తవ్యమును బోధిం చిన ధర్మశాస్త్రములు స్త్రీలకు రక్షణ కవచముగా పనిచేసినవి.

కాని కాలము మార్పులో వారు చెప్పిన మాటలు స్త్రీలకు వేరు విధముగా గోచరించాయి. స్త్రీలను పురుషుల రక్షణలో ఉండమనటం వారిని చులకన చేసినట్లుగా భావించారు. పురుషుని రక్షణలో బ్రతకడం బానిస తనంగా భావించారు. అందుకే స్త్రీలు తాము సబలలమని తమను తాము రక్షించుకొనగలమని పురుషుల రక్షణ అవసరములేదని చాటి చెప్పు చున్నారు. మేము ఉద్యోగాలు చేయగలమని తమను తాము పోషించు కొనగలమని తలచి పెద్ద పెద్ద చదువులు చదివి ఉద్యోగాలు చేస్తున్నారు. ఈ విధంగా స్త్రీలు చదవటం ఉద్యోగాలు చేయటం పైకి బాగానే కని పిస్తుంది. ఆలోచించగా దీనివలన కలిగే అనర్థం కొట్టవచ్చినట్లుగా కనిపిస్తున్నది.

ఈ విధమయిన స్త్రీలను చూచిన పురుషుల హృదయాలలో వేరొక భావన ప్రవేశిస్తున్నది, స్త్రీలు సబలలు. వారి పోషణ భారం మనకులేదు. కాబట్టి మేము ఎందుకు వారిని పోషించాలి? రక్షించాలి? చదివి ఉద్యోగం చేయమనండి. సంపాదించమనండి. పిల్లలను పోషించ

మనండి. మా సంపాదనతో మేము విలాసాలు అనుభవిస్తాము. కాక పోతే సంసారము ఖర్చుకు మా వంతుకు సగముజీతము ఇస్తాము. ఈ విధంగా పురుషులకు స్త్రీల విషయంలో నిర్లక్ష్య భావన ఏర్పడింది.దాని వలన స్త్రీకి రక్షణ పోషణ రెండూ పోయాయి. బజారులో స్త్రీని ఎవరైనా పరిహాసం చేస్తుంటే పురుషులు విలాసంగా చూస్తున్నారు. ఆమెను బాధిస్తే ఉపేక్షిస్తున్నారు. అందుకే స్త్రీలపై అత్యాచారాలు, అన్యాయాలు పెరిగి పోయాయి.

దీనికంతా కారణం స్త్రీలు తమను సబలలమని భావించి, పురుషులనుండి దూరమై తమకుగల హక్కును చూపించుకొనవలయునను భావనతో అహంకారముతో ప్రవర్తించుటయే, అటులగాక వారు చదివి నను సంపాదించినను పురుషులనుండి రక్షణ తమకు అవసరమని భావించిన రోజుననే తమకుతాము అనర్థములనుండి దుష్టుల బారినుండి రక్షణ పొందగలరు.

## 3. తృప్తి ఎప్పుడు?

రామాయణము రమణీయమైన కావ్యము. వాల్మీకి మహర్షి ఆ కావ్యముద్వారా ఎన్నియో సమాజ క్షేమమును కల్గించు సందేశములను అందించెను.

ఆ కావ్యమునందు రాముడు నాయకుడు. రావణుడు ప్రతి నాయకుడు. వీరిద్దరు ఒకరికొకరు తీసిపోని మహాపురుషులే. రావణుడు బ్రహ్మ వంశమున పుట్టి పరమేశ్వరుని మెప్పించి ఎన్నియో వరములను పొందెను. వేదవేదాంగములను చదివెను, కుబేరుని జయించి లంకా నగరమును సంపాదించెను. ఇంద్రుని జయించెను, సూర్య చంద్రు

లను అనుకూలముగ చేసికొనెను. ఎందరో స్త్రీలను స్వాధీనము చేసుకొని భోగభాగ్యములను అనుభవించెను. ఇంతటి బలపరాక్రమములు గలవాడయి నప్పటికి అతనికి తృప్తి కలుగలేదు. కోరికలు తీరలేదు, ఏ విధమయిన వ్యామోహము తగ్గలేదు.

నాయకుడయిన రాముడు దశరధునికి జన్మించెను. తండ్రి తాతల నుండి సంక్రమించిన అయోధ్యానగరముపై సర్వవిధములైన అధికారము కల్గియుండెను. తండ్రియు తనయందు ప్రేమగలవాడై పట్టాభిషిక్తుని చేయుటకు అంతయు సిద్ధము చేసెను. అట్టి శుభ సమయమున అనుకొన కుండగ అయోధ్యానగరమును విడువవలసి వచ్చెను. తనకు చెందవలసిన రాజ్యము దక్కకపోయినను, అడవికి వెళ్ళవలసి వచ్చినను రాముడు ఎట్టి బాధను పొందలేదు. అంతియేగాక అరణ్యమునందు నదీతీరములందు సంచరించుచు, చెట్ల నీడలయందు భూమిపై శయనించుచు, వాహనములపై ఎక్కవలసిన రాముడు కాలినడకన నడచుచు ఆశ్రమములను మునులను సందర్శించెను. ఇట్టి సమయమున ఎట్టి బాధను పొందకపోవుటయేగాక సీత వెంటనుండగ లక్ష్మణుడు సేవించుచుండగ పదునాలుగు సంవత్స రములేగాదు, ఎన్ని సంవత్సరములయినను ఆనందముతో గడుపగల నని చెప్పెను.

నాయకుడయిన రాముడు తనకు దక్కవలసినది దక్కకపోయి నను, కష్టములను బాధలను అనుభవించవలసి వచ్చినను, దుఃఖమును పొందలేదు. అసంతృప్తిని చెందలేదు. రావణుడు తనకు అధికారము లేనిదానిని ఇతరుల నుండి బలాత్కారముగ కాజేసియు ఎవరును అనుభ వించజాలని భోగభాగ్యములను అనుభవించుచుండియు ఆనందమును పొంద లేకపోయెను, తృప్తిని పొందలేకపోయెను.

ఈ ఇద్దరి ప్రవృత్తి వలన మనసు తెలిసికొనవలసిన రహస్యము-ఎవరికిని లేనటువంటి భోగభాగ్యములు లభించినను తృప్తి కలుగదనియు, మనస్సునందు కోరికలు కల్గనిచో అరణ్యమునందయినను ఆనందముగ జీవించగలమనియు.

కాబట్టి ఈనాటి ప్రజలు కోరికలను పెంచుకొనుటచేత పూర్వుల కంటెను ఎన్నియో సుఖభోగములను అనుభవించుచుండియు తృప్తిని పొందలేక పోవుచున్నారు, కోరికలను తగ్గించుకొనినచో అనంతమైన తృప్తిని పొందగలరు.

## 4. పాతివ్రత్యము

పాతివ్రత్యమనునది ఉన్నతమైన యోగసాధన. అట్టి యోగమును సాధించినవారే మహాపతివ్రతలని ప్రసిద్ధిని పొందిరి. అనసూయ, సుమతి, సీత, ద్రౌపది మొదలగు వారందరు మహా పతివ్రతలు. వారు తమ యోగసాధనముచేత మహర్షులవలెనే జితేంద్రియత్వమును, దివ్య దృష్టిని, శాపప్రతిశాపములను సాధించియుండిరి. అందువలన వారికిని మహర్షులవలెనే పూజ్యస్థానము లభించినది. యోగమనగ చిత్తప్రవృత్తులను నిరోధించుట, కర్మలయందు నేర్పును చూపుట యని వివిధములయిన అర్థములు గలవు.

పురుషుడు బాల్యమునందు బ్రహ్మచర్యము నవలంబించి గురువులకు సేవలు చేసి యోగమును సాధించును. ఆ విధముగ స్త్రీలకు పరపురుషులను ఆశ్రయించి సేవలు చేయుటకు అవకాశము లేనందు వలన పతివ్రతలు అయిన స్త్రీలు తమ భర్తలనే గురువులుగ భావించి సేవించి తరించిరి. శరీరమునందు వివిధములు మహత్తరములు అయిన అనేక శక్తులు గలవు. వాటిని క్రమబద్ధముగ ఉపయోగించుటవలన

దివ్యదృష్టి, ఆత్మశక్తివంటి శక్తులు లభించును, యోగఃకర్మసు కౌశలమ్ అని గీతావాక్యము.

పురుషులకు వలెనే స్త్రీలకును జ్ఞానవైరాగ్యములను సంపాదించి ఉన్నతలోకములను మోక్షమును పొందవలసి యున్నది. అట్టివానిని పొందుటకు వివాహమాడిన స్త్రీలకు భర్తను ఆశ్రయించుటకంటె మరి యొక మార్గములేదు. వివాహ సమయమున తన శరీరమును ఇంద్రియ ములను కూడ భర్తకు స్వాధీనము చేసి యున్నది. అట్టివానిని ఇతరులకు వినియోగించుట కానిపని. అందువలన భర్తనే గురువుగ భావించి పతి వ్రతలు సేవలుచేసిరి. ఏమియు చదవక పోయినను మహాపతివ్రతయగు యొక స్త్రీ కౌశికునకు దివ్యోపదేశమును చేసెను.

ఈనాటి స్త్రీలు భర్తలను సేవించుట యనగ మగవారికి బానిసలుగ నుండుటయనియు, అది స్త్రీజాతికి అవమానకరమనియు భావించుచున్నారు. వారలును భర్తలలో సమానమయిన మానసిక వికాసమును బుద్ధి వైభ వమును సంపాదించితిమనియు, భర్తల అడుగుజాడలలో నడువవలసిన అవసరములేదనియు, తలచుచున్నారు. తమ జీవితలక్ష్యమును తామే నిర్ణ యించుకొనగల్గుచున్నారు.

ఇచ్చట తెలుసుకొనవలసిన ముఖ్యవిషయము ఒకటిగలదు. ఈ లోక సంబంధమయిన సుఖభోగములు అనుభవించుటకుగాని, జీవిత లక్ష్య మును సాధించుటకుగాని, విజ్ఞానమును సంపాదించుటకుగాని, భర్తలను అనుసరించవలసిన అవసరములేదు. కాని జితేంద్రియత్వమును ఉన్నత లోకములను జ్ఞానవైరాగ్య మోక్షములను ఋషులవలె సంపాదించుటకు భర్తలను, సేవించుటకంటెను మరియొక మార్గములేదు.

ఈ విషయమును గుర్తించిన స్త్రీ లందరు పాతివ్రత్యమునందలి ధర్మమహాత్మ్యములను తెలుసుకొని తరింతురుగాక.

# 5. తక్కువ పని-ఎక్కువ భోగము

బాలురకు శరీరమంతయు ఒకే రూపముగ కనిపించును, సామాన్య మయిన వివేకముగలవారికి కాళ్ళు చేతులు వేరువేరు అవయవము లనియు అవి చేయు పనులు వేరువేరు అనియు తెలియును. అంతకంటెను మించి వేదాంతసంబంధమయిన ఆలోచన చేసిన వారికి కర్మేంద్రియ ములు జ్ఞానేంద్రియములు ప్రాణములు మనస్సు బుద్ధి అను వానిని గురించి తెలియును.

కాళ్ళు, చేతులు, నోరు, మూత్రస్థానము, పురీషస్థానము అను నవి కర్మేంద్రియములు కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము అను నవి జ్ఞానేంద్రియములు, ప్రాణము అపానము వ్యానము ఉదానము సమానము అనునవి పంచప్రాణములు. ఈ ఇంద్రియములను ప్రేరే పించువానిని మనస్సు అనియు, నిశ్చయశక్తిగలదానిని బుద్ధి అనియు అందురు.

మనస్సు తనవాంఛలను తీర్చుకొనుటకు ఇంద్రియములను ప్రేరేపించుచుండును. ఆ ప్రేరణ ననుసరించి ఇంద్రియములు పని చేయును. మనస్సునకు అందమయిన దృశ్యమును చూడవలయునని కోరిక కల్గినచో అచ్చటకు వెళ్ళుటకు పాదములను ప్రేరేపించును. ఆ పాదములు శరీరమునంతయు మోసుకొని వెళ్ళును. ఆ వెళ్ళుటవలన పాదములకు ఎంతయో బాధ కలుగును. అయినప్పటికిని మనస్సునకు గల కోరికను తీర్చుటకు పాదములు కష్టపడుచున్నవి. అటులనే మనస్సునకు బరువయిన వస్తువును తీసికొని వెళ్ళవలయునను కోరిక కల్గినచో ఆ కోరిక తీర్చుటకు చేతులు శ్రమపడి ఆ బరువును మోయు

చున్నవి అటులనే మూత్రవిసర్జన స్థానము పురీషస్థానము నోరును కూడ శరీర రక్షణకు కావలసిన పనులు చేయుచున్నవి. ఈ విధముగ మనస్సు కర్మచారులవంటి కర్మేంద్రియములను ప్రేరణచేసి జ్ఞానేంద్రియముల ద్వారా భోగములు అనుభవించుచున్నది.

ఇచ్చట పనిచేయునవి కర్మేంద్రియములు; భోగములు అనుభవించునవి జ్ఞానేంద్రియములు. రంగస్థలమునకు శరీరమును మోసుకొని పోవుటకు పాదములు బాధపడుచున్నవి. అచ్చట దృశ్యములు చూచి కన్నులు పాటలు విని చెవులు ఆనందించుచున్నవి.

ఒక పెద్ద పారిశ్రామికుడు తన పరిశ్రమలో పనిచేయుటకు కొందరు కర్మచారులను నియమించుకొనును. ఆ పరిశ్రమవలన లక్ష రూపాయలు లాభము వచ్చినచో ఎనభై వేల రూపాయలు కర్మచారులకు జీతముల క్రింద ఇచ్చి ఇరవై వేల రూపాయలు తాను అనుభవించును. అంతియేగాని లక్షరూపాయలు లాభమువచ్చిన లక్ష ఇరవై వేల రూపాయలు జీతములక్రింద ఇవ్వడు. అటుల ఇచ్చినచో తాను నష్టపడును.

అటులనే కర్మేంద్రియముల ద్వారా సంపాదించిన ధనమును జ్ఞానేంద్రియముల తృప్తికై తక్కువ ఖర్చుపెట్టవలయునేగాని ఎక్కువ ఖర్చుపెట్టరాదు. ఇచ్చట కర్మేంద్రియములు కర్మచారులు. జ్ఞానేంద్రియములు భోగపురుషులు. కర్మేంద్రియముల వలన సంపాదించిన ధనమునకుమించి జ్ఞానేంద్రియములు అనువానికి భోగములు అను జీతములను ఎక్కువ ఇచ్చినచో బుద్ధి అను పారిశ్రామికుడు నష్టపడును, ఇందువలన పనులచే సంపాదించిన ధనమునకు మించిన భోగములు అనుభవించరాదు. ఈ విషయమునందు దైవచింతన కలవారు

మిక్కిలి జాగరూకులై యుండవలయును. భోగములు వైపరీత్యనకు విరోధములు.

## 6. చిన్నకథ - పెద్ద విషయము

పూర్వకాలమున మహాతపుడు అను ముని తపముచేయుచుండెను. ఆ సమయమున ఆకాశమున పెళ్ళుచున్న కాకి నోటినుండి జారి ఎలుక పిల్ల యొకటి ముని సమీపమున పడెను. ముని దయతలచి దానికి ధాన్యపుగింజలుపెట్టి పెంచుచుండెను. దానిని తినుటకై పిల్లి యొకటి దానిని వెంబడించెను. అది తెలిసిన ముని ఎలుకను పిల్లిగ చేసెను. పిల్లిని తినుటకు కుక్క వెంబడించెను. ముని పిల్లిని కుక్కగా మార్చెను. కుక్కవెంట పులిపడగా ఆ కుక్కను ముని పులిగా మార్చెను. ఆ పులిని చూచి మునులందరు ఇది ఎలుకపిల్లయే అనుచుండిరి దానిని వినిన ఆ ఎలుక పులి, మునిని చంపినగాని తనకు కలుగుచున్న ఈ అవమానము పోదు అని తలంచుచుండెను.

ఆ విషయమును తెలిసికొనిన ముని ఆ పులిని ఎలుకగ మార్చెను, ఇది చిన్న కథ. దీనివలన తెలుసుకొనవలసినది పెద్ద విషయము. ఎలుక ఎలుకగ నున్నపుడు మునిని చంపవలయునను కోరిక కలగ లేదు. పులిగా మారినపుడు మాత్రమే ఆ కోరిక కలిగెను. ఆ కోరిక కలుగుటకు కారణము దానికి పులిశరీరము లభించుటయే, ఇందువలన మనము గ్రహించవలసిన విషయము- మనకు కలుగు కోరికలు స్థూలశరీరము ననుసరించియే కలుగుచున్నవి.

మానవునకు బాల్యము కౌమారము యౌవనము వార్ధక్యము అను నాలుగు దశలు కలుగును. ఆ దశల ననుసరించియే కోరికలు కలుగు

చుండును. మన ఆచారములలో వేరువేరు సమయములందు ఇతరులను తాకరాదు అను నియమము కలదు. తాకిన ఏమగును. అని ఈనాటి వారు ప్రశ్నించుచుందురు. తాకిన సమయమున ఇతరుల శరీరము లందుగల రేణువులు వీరివి వారికి వారివి వీరికి, సంక్రమించును. దీనికి నిదర్శనము- కొన్ని రోగములున్నవారిని తాకినచో లేనివారికిని ఆ రోగములు వచ్చును. కొందరు పాపములు చేయుచుండిరి. అందులకు కారణము వారి శరీరమునగల అణువులు, వారిదగ్గర చేరినవారికి వారి అణువులు వీరికి చేరుటచే వీరును పాపస్వభావముగలవారగుదురు. ఆకారణము చేతనే పాతకునితో సహవాసము చేసిన పురుషుడు పాతకియే యగునని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. ఈ కారణము చేతనే ఆరు మాసములు సహవాసము చేసినచో వీరు వారు అగుదురు అను సామెత పుట్టెను. అందువలన ఒకరి నొకరు తాకకూడదనుట మూఢాచారము కాదనియు తాకుట వలన మంచివారి మనస్సులు కూడ చెడుమార్గమున ప్రవర్తించుననియు తెలుసుకొనవలసి యున్నది.

## 7. మాంసాహారము పాపమా ?

ఒకదినమున ఒక మిత్రుడిలా ప్రశ్నించాడు. మాంసముతింటే పాపం వస్తుందా అని నేను ఇలా సమాధానం చెప్పాను. పాపం వస్తుందో లేదో నాకు తెలియదు. లోకానుభవంచేత మాంసం తినటం మంచిదికాదు అని తోస్తుంది.

లోకంలో మాంసం తినే జీవులున్నాయి మాంసం తినని జీవులు కూడ ఉన్నాయి. అరణ్యంలో ఉండే ఏనుగు ఒంటె జింక మొదలయి నివి మాంసం తినవు. సింహం పులి చిరుతపులి మొదలయినవి మాంసం తింటాయి. మాంసం తినని వానిని పశువు అనే పేరుతో పిలుస్తాము.

మాంసం తినేవాటిని మృగాలు అనే పేరుతో పిలుస్తాము. మాంసం తినేవానికంటె మాంసం తినని ఏనుగు ఒంటె ఎద్దు గేదె గుర్రము మొదలయినవి ఎంతో బలంగా ఉంటాయి. అయినప్పటికి మానవుడు వానిని తన స్వాధీనములో నుంచుకొని వానివలన ప్రయోజనము పొందుతున్నాడు. అవి కూడ మానవులకు ఉపకారము చేయుచు వారితో కలసి మెలసి తిరుగుతున్నాయి. ఈ విషయము అందరికి అనుభవంలో ఉన్నది సింహము పులి మొదలయిన మృగాలు పైన చెప్పిన పశువుల కంటె చాల బలహీనము అయినవి. అయినప్పటికి మానవుడు వానిని తన స్వాధీనములో ఉంచుకోలేక పోతున్నాడు. అవి కూడ మానవులతో కలసి మెలసి తిరుగలేకపోతున్నాయి. దానికి కారణం ఏమిటి ?

ప్రతిప్రాణిలోగూడ సత్త్వము రజము తమము అనే మూడు గుణాలు ఉంటాయి. సత్త్వము అనగా శాంత స్వభావము; రజము అనగా క్రోధస్వభావము; తమము అనగా మాదక స్వభావము. ఆహారము శరీరమునకు బలమును శక్తిని పుష్టిని ఆరోగ్యమును ఇచ్చుటయే గాక పైన చెప్పిన గుణములలో మార్పును కలిగించును. శాకాహారము వలన సత్త్వగుణము పెరుగును. మాంసమువలన రజోగుణము పెరుగును. మాదకద్రవ్యములవలన తమోగుణము పెరుగును. ఈ కారణముచేతనే మాంసభక్షణము చేయు పులి మొదలగునవి క్రోధ స్వభావము కలిగియున్నవి. బలములేనివి అయినప్పటికి మానవునకు స్వాధీనముకాక యున్నవి. ఎవరికిని ఉపకారము చేయలేకపోవుచున్నవి. ఏనుగు ఒంటె మొదలయినవి మిక్కిలి బలము కలిగినవి.

అయినప్పటికి శాకాహారులగుటచేత శాంతస్వభావము కలవియై మానవులకు లోబడి ఉపకారము చేయుచున్నవి.

ఆహారము వలన కలుగు మార్పులు గుర్తించిన ప్రాచీనులు మాంసాహారము కంటె శాకాహారము మంచిదని చెప్పిరి. మాంసాహారము వలన రజోగుణము పెరుగుటచే మానవుడు క్రోధస్వభావము గలవాడై యుండును. దానివలన తనకు తనవారికి హాని కలుగచేయును. అందువలన అది అనుచితమగుచున్నది. అంతియేగాక మనువు మాంస శబ్దమునకు ఇటుల అర్థము చెప్పెను- సః — ఆ, నే, తినిన జంతువు. మాం : నన్ను తినును. ఆధ్యాత్మిక చింతనగలవారికి మాంసాహారము తప్పనిసరిగ విడిచి పెట్టవలసి యున్నది. శాకాహారము తిను జంతువులే ఎక్కువ కాలము జీవించగలుగుచున్నవి.

## 8. సుఖము శారీరకమా ? మానసికమా ?

ప్రతివారును సుఖమును అనుభవించుటకై ఎన్నియో ప్రయత్నములు చేయుచుందురు. కాని ఆ సుఖ స్వరూపమును గురించిన వివరములు అందరకును తెలియవు. తెలుసుకొనదలచినవారికి ముందుగ ఈ శరీరమును గురించిన వివరములు తెలియవలయును.

ఈ శరీరమునందు బయటికి కన్పించునటువంటి చర్మము రక్తము మాంసము ఎముకలు మాత్రమేగాక అంతః శరీరము ఒకటి కలదని గుర్తించవలయును. దానినే లింగశరీరమని వేదాంతులు చెప్పుదురు. అది వాయురూపమున ఉండును. దానిని ఆశ్రయించుకొనియే ప్రాణములు మనస్సు బుద్ధి మొదలగునవి ఉండును.

గాయములగుట ఎముకలు విరుగుట రోగాదులు వచ్చుట దెబ్బలు తగులుట మొదలగునవి బాహ్యశరీరమునకు సంబంధించిన ధర్మములు. మానసిక వికారములయిన శోకము ఆలోచనలు అనుమానములు కోపము కామము మొదలగునవి అంతః శరీరమునకు సంబంధించిన ధర్మములు.

ప్రతివారును బాహ్యమునకు కనిపించు శరీరమును అలంకరించుకొందురు. దానికే ఆభరణములు పెట్టుకొందురు. మంచి వస్త్రములు ధరింతురు. సుగంధములను పూసుకొందురు. దీనివలన అధికమయిన సుఖము కల్గునని భ్రాంతి పడుదురు. ఈ యలంకారములతో నిండిన శరీరముతో ఉన్నత కార్యమును సాధించుటకు వెళ్లుదురు, తలంచినపని కానిచో విపరీతమయిన దుఃఖమును పొందుదురు. ఈ సమయమున బాహ్యశరీరము ఎన్నియో యలంకారములతో నిండి సుస్థిరముగనున్నను దుఃఖముకలుగునేకాని సుఖము కలుగదు. ఇందు వలన సుఖము బాహ్యశరీరముపై ఆధారపడియుండలేదనియు లింగ శరీరముపై ఆధారపడి యున్నదనియు తెలుసుకొనవలయును. ఉదాహరణమునకు పెండ్లి చూపుల సమయమున పెండ్లి కుమార్తెను ఎన్నియో విధములయిన అలంకరణలతో అలంకరింతురు. పెండ్లి కుదరనిచో ఆమెకు దుఃఖము కలుగునేగాని ఈ యలంకరణముల వలన సుఖము కలుగదు.

ఇందువలన ప్రతివారును సుఖసాధనమయిన లింగశరీరమును అలంకరించుకొనుటకు ప్రయత్నించవలయును. ఆ శరీరమును అలంకరించుకొనుటకు మహాపురుషులు రచించిన మంచిగ్రంథములు చదువ

వలయును. వారు చేసిన మంచిపనులు చేయవలయును. వారు నడచిన రీతిలో నడువవలయును. అప్పుడు అనంతమయిన తృప్తి కలుగును. ఆ విధముగ లింగశరీరమును అలంకరించుకొనినవారే మహాపురుషు లగుదురు. అట్టివారే ప్రాచీన కాలమునందలి వశిష్ఠుడు గౌతముడు జనకుడు రాముడు మొదలగువారు, అధునాతన కాలములో రమణ మహర్షి రామకృష్ణ పరమహంస స్వామి వివేకానంద కామకోటిపీఠాధిపతులు మొదలయినవారు.

# 9. అద్వైతం అంతుపట్టని విషయమా !

జగద్గురువులయిన శ్రీ శంకరాచార్యులవారు సమస్త వేద సముద్ర మును మథించి తాము కనుగొనినదానిని, అనుభవించిన దానినే అద్వైత మను పేరుతో లోకమునందంతట ప్రచారముచేసి దిగ్విజయమును సాధిం చిరి. వారు వేద శాస్త్ర సమ్మతమయిన సనాతనములయిన విషయములనే ప్రజాసముదాయమునకు అందచేసిరిగాని లేనిదానిని అనుభవమునకు దూర మయిన దానిని చెప్పలేదు- ఆ విషయములు తెలుసుకొనుటకు ప్రయత్నము చేయనివారు అద్వైతము అందుబాటులో లేని విషయమని భావింతురు, యదార్థమునకు అది అందుబాటులో ఉన్న విషయమే. అనుభవముతో కూడ ఉన్న విషయమే.

అద్వైతమతమున పరిణామము - వివర్తము అని రెండు వాద ములు గలవు. లోకమునందంతటను ఒకే ఒక శక్తి వ్యాపించి యున్నది. దానిని పరబ్రహ్మయనియు ఆత్మయనియు చెప్పుదురు. అదియే ఈ సమస్త సృష్టికి కారణమయినది.

పరిణామవాదములో ఆశక్తియే వివిధ రూపములు చెంది మనకు రకరకములయిన రూపములతో కనిపించుచున్నది. అందులకు ఉదాహరణము ఇటుల చెప్పుదురు. బంగారముతో అనేక ఆభరణములు చేయుదురు. ఆయాభరణముల రూపములు నామములు వేరువేరుగ నుండును. వానియందున్నది బంగారము మాత్రమే. వానియందుగల నామరూపములు కల్పితములు. ఎందులకన వానిని మరల కళగించి వేరువేరు ఆభరణములు చేయించిన అవి వేరువేరు రూపములతో నామములతో పిలువబడును. కంకణములు ఉంగరములు అగును, ఉంగరములు హారములగును. హారములు కర్ణాభరణములగును. ఈ విధముగ ఆ బంగారముతో ఎన్నియో వస్తువులు చేయించవచ్చును. బంగారము మాత్రము అదియే అది సత్యము. అది మారదు. ఆ విధముగ ఒక్క అనంతశక్తియే సూర్యచంద్రులుగ భూమ్యాకాశములుగ అనేక జీవరాశులుగ మారినది. కావున ఒక వస్తువుకు చెందినవే ఈ నామరూపములు, ఇవి అసత్యములు. ఆ బ్రహ్మస్వరూపము సత్యము. నిత్యము. ఈ విషయమునే "బ్రహ్మసత్యము జగన్మిథ్యా" అని వేదాంత వాక్యము చెప్పుచున్నది.

మరియొకటి వివర్తవాదము. ఈ వాదమునందు బ్రహ్మస్వరూపము మారదు. మనకు గల అజ్ఞానవశమున ఆ బ్రహ్మయే వేరువిధముగ కన్పించుచున్నది. లేనిది ఉన్నట్టుగా కనిపించుచున్నది. దానికి భ్రాంతి కారణము. దీనిని రజ్జు సర్పభ్రాంతి యందురు. చీకటియందు త్రాడును చూచినవాడు పాము అని భ్రాంతిపడి భయపడెను. మరియొకడు దీపము తెచ్చి చూపగా త్రాడు అని తెలిసికొని భయమును

విడిచెను. ఈ భయమునకు కారణము భ్రాంతియే. అది తొలగిన వెంటనే భయముపోయెను. అటులనే మనకు గల భ్రాంతి కారణమున పొరబడుచున్నాము. అది తొలగిన మనకు యదార్థ స్వరూపము కనిపించును; అందులకు సద్గురువుల నాశ్రయించినచో వారు, దీపము చీకటిని తొలగించినటుల మన యజ్ఞానమును పోగొట్టుదురు. అప్పుడు సమ్యగ్దర్శనము కలుగును.

భ్రాంతియనునది కొందరికే యుండునుగాని అందరకు ఉండునా యని అనుమానము కలుగును. అందురు ఒకే స్వభావము గలవారగుటచేత అందరికి భ్రాంతి సహజముగ ఉన్నది. ఉదాహరణకు - ధన విషయమున నాణెములకు బదులుగా కాగితములు వచ్చుచున్నవి. ఆ కాగితముపై అయిదు అంకెయున్న అయిదు రూపాయులు అని చెప్పుదురేగాని దానిని కాగితము అని చెప్పరు. యథార్థమునకు అది కాగితమే గదా, దానిపై అయిదు వేసిన అయిదురూపాయలు, పదివేసిన పదిరూపాయలు, వంద అంకెవేసిన వందరూపాయులు అగును. యదార్థమునకు అది కాగితమేగాని ఏదియుకాదు. అటులనే ప్రపంచ విషయమున భ్రాంతి సహజముగ నున్నది. పుట్టుకచేత ఎవరికి చదువురాదు. అది సహజము, చదువుకొనిన వచ్చును. అటులనే పుట్టుకచేత వచ్చిన అజ్ఞానమును జ్ఞానసంపాదనముచే తొలగించుకొనవచ్చును.

పరిణామవాదమును వివరించుచు శ్రీ శంకరాచార్యులవారు బీజస్యాంతరివాంకురో జగదిదం 'ప్రాఙ్నిర్వికల్పం' అని చెప్పిరి. అనగా అంకురము మొలకెత్తుటకు పూర్వము బీజమునందు దాగియున్నది. అటులనే ఈ ప్రపంచమంతయు ఆవిర్భావమునకు ముందు బ్రహ్మయందు దాగియున్నది ఇచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిః అని కాళిదాస

మహాకవి చెప్పిన విధమున బ్రహ్మయొక్క కోరికచే సృష్టి విచిత్ర రూపములతో నావిర్భవించినది. ఈ విధముగ జీవులందరు బ్రహ్మనుండి వచ్చినవారగుటచే జీవో్బ్రహ్మైవ నాపరః అనువాక్యము అనుభవసిద్ధమగుచున్నది.

వివర్తవాదమును వివరించుచు ఆచార్యులవారు "విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ తుల్యం నిజాంతర్గతం పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథానిద్రయా" అని చెప్పిరి, ఈ సృష్టి అంతయు ఆత్మస్వరూపమై యున్నది. అయినప్పటికి భ్రాంతిచేత మనకు వివిధ రూపములుగ గన్పించుచున్నది. ఇందులకు స్వప్నము దృష్టాంతము. నిద్రపోవుసమయమున స్వప్నమునందు ఎన్నియో దృశ్యములు కనిపించును. అవి యన్నియు ఉన్నవా ? లేవు. లేనివి ఎటుల కనిపించుచున్నవి? మనస్సునందు మాయచేత కల్పించబడియున్నవి. అటులనే ఈ ప్రపంచము తనదైన ఆత్మయందు అద్దమునందు కన్పించు నగరమువలె కన్పించుచున్నది. కాని యథార్థమునకు లేదు. సద్గురువు నాశ్రయించి ఆత్మానాత్మ విచారము చేసినవారికి ఈ విషయములు అనుభవములోనికి వచ్చును.

# 10. మోక్షమంటే ఏమిటి ?

మోక్షమనే శబ్దాన్ని అందరూ నిత్యము ఉపయోగిస్తుంటారు. శరీరానికి శ్రమకల్గినప్పుడు నాకింకా మోక్షం లభించలేదు ఏమిచేస్తాను? నాకు మోక్షం ఎప్పుడు లభిస్తుందో తెలియదు. ఈ జీవితానికి మోక్షమంటూ లేదు. పుణ్యం చేసినవారికి మోక్షం లభిస్తుంది. పుణ్యం చేస్తేకదా మోక్షం లభించేది? ఈ విధమయిన మాటలు వింటూ

ఉంటాము. అయితే మోక్షమంటే ఏమిటో దాని స్వరూప స్వభావాలేమిటో చాలామందికి తెలియవు.

మోక్షమనే శబ్దానికి విడుదల అని సామాన్యార్థం, బంధం ఉంటే గదా విడుదల ? కాబట్టి మనమందరం బంధంలో ఉన్నామని తెలుసు కోవాలి. ఏమిటా బంధం? మనకు సామాన్యంగా - బంధంలో ఉన్నట్టే తెలియటంలేదు. అటువంటప్పుడు విడుదల కోసం ప్రయత్నమేమిటి ? కాబట్టి ఆ బంధాన్ని గురించి తెలుసుకోవాలి. దానిని సంసారబంధం అంటారు. సంసార బంధం ఏమిటి ? భార్యాబిడ్డలేగదా సంసారం. వారివల్ల సుఖం లభిస్తున్నది. వారిని వదలాలని, వారు బంధం అని మనస్సుకు తోచటంలేదు. పైపెచ్చు వారిని వదలాలంటే బాధ కలుగు తున్నది. కాబట్టి వారిని బంధం అనుకోవటం ఎందుకు ? వారిని వదలాలనే ప్రయత్నం ఎందుకు ? కొందరు జనన మరణాలే బంధం అంటారు. ఆ రెండూ బంధాలు అవునో కాదో మనకు తెలియని విష యాలు. పుట్టేటప్పుడూ ఏమీ తెలియదు పోయేటప్పుడూ తెలియదు. ఆ తెలియని విషయం బంధం ఎలా అవుతుంది ? కాబట్టి ముందుగా బంధాన్ని గురించి వివరంగా తెలుసుకోవాలి.

అంతకు ముందు ఈ శరీరాన్ని గురించి తెలుసుకోవాలి.

ఈ శరీరంలో మూడు భాగాలున్నాయి. ఒకటి పైకి కనిపించే రక్తమాంసాదులతో నిండిన స్థూలశరీరం. రెండవది ప్రాణములు మనస్సు బుద్ధి జ్ఞానేంద్రియములతో గూడిన సూక్ష్మశరీరం. మూడవది వీటికి సాక్షిగా ఉన్న ఆత్మ, స్థూలశరీరం అందరికి కనిపిస్తుంది. లోపల ఉన్న లింగశరీరం కూడా పేరు తెలియకపోయినా రూపం కనిపించక పోయినా అనుభవంలో అందరికీ తెలుస్తుంది అందరూ కష్టకాలంలో

నామనస్సు బాగాలేదని ప్రాణాలుపోతే బాగుండునని నా ప్రాణం పోతున్నదని అంటారు. నా మనస్సుకు సుఖంలేదని కూడా అంటారు. దీనివలన లింగశరీర జ్ఞానం కూడా అందరికి ఉన్నదని చెప్పవచ్చు. ఇంక మూడవది తనదైన ఆత్మ. దానిని గురించి కొంచెము తెలుసుకోవాలి. ఇది కూడా అందరికీ తెలిసిన విషయమే. అయితే కొంచెము ఆలోచన కావాలి.

అందరికీ రాత్రిసమయంలో నిద్రలో కలలు వస్తూ ఉంటాయి. తెల్లవారిన తరువాత ఆ కలను గురించి అందరికీ చెప్పి ఆ కల మంచిదా కాదా అని అడుగుతాం. ఇది అందరకీ అనుభవసిద్ధం. ఆ కలను దేనితో చూశాం? ఆ సమయంలో ఈ కళ్ళు తెరవలేదు. ఈ నోరు మాట్లాడలేదు. ఈ చేతులు కాళ్ళు పనిచేయలేదు. అవి చేసిన పనులు మాటలాడిన. మాటలు విన్నమాటలు చెప్పుతాంకదా. వాటిని వేనితో చూశాం అంటే లోపలగల అందరినీ, అన్నిటిని చూడగల సాక్షి రూపంగా ఉన్న ఆత్మతో చూశాం. దానినే వేదాంతులు కూటస్థుడు అని ఆత్మ అని సాక్షిఅని దృక్ అని అంటూ ఉంటారు. అదియే యథార్థమైన సత్యమైన నిత్యమైన సచ్చిదానంద రూపమయిన ఆత్మ స్వరూపము; మన స్వరూపము. తక్కినవన్నియు మనవి కానివి. మనవని అవి భ్రాంతిని కలుగచేయుచున్నవి.

అనగా స్థూల సూక్ష్మ శరీరాలు మనవి కాదన్నమాట, కేవలము ఆత్మయే మన స్వరూపం అని జ్ఞాపకం పెట్టుకోవాలి.

మనకు ఎన్నియో దుఃఖములు సుఖములుగూడ కలుగుచున్నవి. ఈ సుఖదుఃఖములు ఎటుల కలుగుచున్నవి? ఏ ఇంద్రియముల వలన కలుగుచున్నవి? అవి ఏ విధముగ నశించును అని తెలుసుకోవాలి.

ఈ సుఖములు దుఃఖములు స్థూల సూక్ష్మ శరీరములవలన కలుగుచున్నవి. కాలు విరిగిన బాధకలుగును. చేతికి కురుపులేచిన బాధ కలుగును. రోగము వచ్చిన బాధకలుగును. ఇవి స్థూలశరీరము వలన వచ్చిన బాధలు. ఈ బాధలను లింగశరీరమున నున్న ప్రాణములు మనస్సు అనుభవించుచున్నవి. స్థూలశరీరమునకు వచ్చిన దానిని లింగ శరీరము అనుభవించుచున్నది. స్థూలశరీరము మనదికానప్పుడు దానికి వచ్చిన బాధను లింగశరీరము ఎందుకు అనుభవించవలయును. ఎవరిదో ఎక్కడో ఇల్లు కాలితే మన శరీరమునకు వేడి తగలదుకదా. స్థూలశరీరమునను కలిగిన కష్టమును లింగశరీరము అనుభవించ నవస రము లేదు. కాని అనుభవించుచున్నది. ఎందువలన ? లింగశరీరము స్థూలశరీరమును తనది అని అనుకొనుచున్నది. మనము క్రొత్తగా యిల్లు కొంటాము. కొనక పూర్వము అది పడిపోయినను మనకు బాధ ఉండదు. కొన్నతరువాత దానికి మేకు కొట్టినను మన శరీరమునకు కొట్టినట్లుండును. ఎందువలన ? అది మనదికాబట్టి. ఇల్లు పూర్వమున్న చోటనే యున్నది. మన శరీరము మనదగ్గరే యున్నది. కాని అది మనది అనుకొనుటచేత ఈ సుఖదుఃఖములు కలుగుచున్నవి. కాబట్టి మన అనుభావనయే ఈ సుఖదుఃఖములకు కారణము. దానిని భ్రాంతి అందురు. కాబట్టి స్థూల శరీరము లింగశరీరమునకు బంధము. ఆ బంధము వదలిన స్థూలశరీర మునకు కలిగిన కష్టసుఖములు లింగశరీరమునకు అంటవు. ఇది ప్రథమ బంధము.

ఇంక లింగశరీరము - మనోవ్యాకులత కామక్రోధాదులు లింగ శరీర లక్షణములు, కోరికలు పెరుగుటచేత అవితీరక పోవుటచేత లింగ శరీరము బాధపడుచుండును. సినిమా చూచి సంతసించునది పాట విని ఆనందించునది లింగశరీరమే యని గుర్తించవలయును. అందువలననే రోగిష్టియైన మానవుడు మంచముమీదనుండియు సినిమాపాటను ఆనందముగా వినును. కావున ఈ సంతోషము లింగశరీరమునదేకాని స్థూలశరీరము నదికాదు. నా ప్రాణములు పోవుచున్నవి. నా మనస్సు బాగుండలేదు అనువాక్యములవలన నా అను ఆత్మకంటె లింగశరీరము వేరు అని భావించవలయును. ఈ లింగశరీరము నేను కానప్పుడు దానికి కలిగిన బాధ నేను ఎందుకు అనుభవించవలయును? ఎవరిదో ఇల్లు కాలినపుడు ఆ బాధను వారు అనుభవించుదురుకాని మనకెందుకు బాధ? తన లింగశరీరము నకు కలిగిన కామక్రోధాదులు నావి కావు అనుకొనినచో దానివలన కలిగిన సుఖదుఃఖములు నశించును. ఈ విధమున రెండవదైన లింగ శరీర బంధము నశించును.

అప్పుడు తనదైన ఆత్మస్వరూపము మిగులును. దీనికి ఏ సుఖ దుఃఖములులేవు. ఏ రోగాదులులేవు. కేవలము సాక్షిగా మాత్రముండును. ఈ విధముగ స్థూల సూక్ష్మశరీర బంధములనుండి తప్పించుకొనుటయే మోక్షము. విడుదలయని గ్రహించవలయును.

ఇంత వివరముగ చెప్పినను తెలియజాలని వానిని గురించి విద్యారణ్య స్వాములవారు "పంచదశిలో కథం ప్రబోధయే చ్ఛాస్త్రం నరం లోష్ట సమాకృతిమ్". అనగా మంటి పెడ్డతో సమానముగా నున్న మానవునకు శాస్త్రము ఇంక ఎట్లు తెలియచేయుగలదు? అనిరి.

# 11. నిత్యానందము

మానవులంతా ఆనందానుభవం కోరి నీటికై ఎండమావులవెంట పరుగెత్తు లేడిపిల్లలా ధన సంపాదన కోసం పరుగెత్తుతున్నారు. కాని ధనం సంపాదించినకొద్ది వీరి దాహం పెరుగుచున్నదేకాని ఆనందం కలుగుటలేదు. ఇది అందరికి అనుభవసిద్ధం. ఆనందాన్ని ఇస్తుంది అనుకొని దానిని సంపాదించటానికి నానాశ్రమలు పడి సంపాదించి నప్పటికి అది సంపూర్ణానందాన్ని ఇవ్వటంలేదు. అంటే అది దాని దోషమా లేక మన దోషమా ? దాని దోషమేనైతే అది తెలియక పరుగెత్తటం మనదోషం. మనదోషమే నంటే భూమండల వాసులంతా అట్లా దానివెంట పడుతున్నప్పుడు ఇంతమంది తప్పు చేస్తారా? అందరిని తెలివిలేని వారనటం హాస్యాస్పదంకాదా? నిజమే. అందరిని తెలివిలేని వారనటం హాస్యాస్పదం. అయితే దానివలన ఏ ఒక్కరికీ సంపూర్ణా నందము కలగనప్పుడు వారి యాలోచన సరియయినది అని చెప్పటం హాస్యాస్పదం కాదా ?

అయితే ధనం ఆనందాన్ని యివ్వదా ? ఇది యివ్వకపోతే ఏది ఆనందాన్ని యిస్తుంది. అనే ప్రశ్నలు బయలుదేరుతాయి. ధనమే కాదు బాహ్యానికి కనిపించే ఏ వస్తువూ ఆనందాన్ని యివ్వదు. ఇచ్చినట్టు భ్రాంతిని మాత్రం కలుగ చేస్తుంది. ఆ భ్రాంతిని ఆధారం చేసుకొని అదియే నిజమని అందరు అనుభవిస్తున్నారు. పసిపిల్లవాడు సినిమా చూచి నిజమనుకొనినట్లు, ఉదాహరణకు మీరు శ్రమపడి అపరూప మయిన ఒక నూతన వస్తువును సంపాదించారు. దానిని చూచి మీరు చూచిన వారందరు తన్మయులై సంతోషిస్తున్నారు. ఈ సమయంలో ఆ వస్తువును గురించిన భావనయే వారి మనసులో లగ్నమగుచున్నది.

వారికి మరియొకటి కనుపించదు. మరియొకటి తోచదు. శరీరజ్ఞానము గూడ ఉండదు. కాని వారు అనుభవించిన ఆనందము మాత్రము, అపూర్వము. కొన్ని నెలల వరకు మరచిపోలేరు. నిజానికి వారికి జరిగిందేమిటి ? వారి మనస్సు ఆ యపూర్వమయిన వస్తువుమీద కొన్ని క్షణాలు లగ్నమయింది. అంటే యీ యానందము మనస్సు వస్తువునందు లగ్నము కావటమువలన కలిగిందేకాని వస్తువునుంచి వారి మనస్సులోకి ఏ పదార్థము శరీరములోనికి భోజనమువలె చేరుట వలన మాత్రము కాదు. ఇది అందరకు అనుభవసిద్ధము. అనగా మనస్సు ఒక వస్తువునందు లగ్నమయినపుడు మనస్సునందు ఆనందము కలుగుతుంది. అది యేవస్తువు అయినా కావచ్చు. అందుచేత నీకు కల్గిన ఆనందము నీవు చూచిన ఆ ఒక్క వస్తువుచేతనే కలుగదు, అటువంటి అపూర్వమయిన ఏ వస్తువును చూచినా కలుగుతుంది. అంటే ఈ ఆనందము ఆవస్తుగతమే అయినప్పుడు ఆ వస్తువును చూచినపుడు మాత్రమే కలగాలి. కాని అటుల కలుగుటలేదు. ఏ వస్తువును చూచినా కలగటంచేత అది వస్తుగతముకాదు. మనస్సు వస్తువునందు లగ్నమగుట చేత కలిగినది అని తెలుసుకోవాలి. కాని ప్రతి మానవుడు ఆ వస్తువు ఆనందము కలిగించును అని భ్రాంతి పడుచున్నాడు. ఇది అందరి ఆలోచనకు తెలిసేమాట.

అంటే మనస్సు దేనియందయినా లగ్నమయితే ఆనందము కలుగుతుంది. అని జ్ఞాపకము పెట్టుకోవాలి. ఒకవేళ మనస్సు చంచలమై ఆ వస్తువునందు లగ్నము కాకపోతే లగ్నము చేయుటకు ప్రయత్నించాలి. ధ్యానమనగా అదియే తపస్సనగా నదియే. తాము

కోరిన భగవంతుని యందు మనస్సు లగ్నముచేయుట. అలా లగ్నము చేస్తే తన్మయత్వము కలిగి ఆనందము కలుగుతుంది. చివరకు పర్యవసానములో ఆనందము ధనమువలన కలుగదు. మనస్సును వస్తువునందు లగ్నము చేయుటచేత కలుగుతుంది.

ప్రతివారికి నిద్రానుభవమున్నది. గాఢనిద్రలో స్థూలశరీరము అయిన కాళ్ళు చేతులు పనిచేయవు. సూక్ష్మశరీరమయిన కన్ను ముక్కు చెవి పనిచేయవు. మనస్సుగూడ పనిచేయదు. కాని నిద్రలో విపరీతమయిన ఆనందానుభవము ప్రతివారికి కలుగుచున్నది. అక్కడ ధనములేదు. అపరూపమయిన వస్తుదర్శనములేదు. అయినప్పటికి సుఖము ననుభవిస్తున్నాముగదా అనుభవించటం లేదా ? అందరికి అనుభవంలో ఉన్న విషయం. కాదనటం ఎవరికీ సాధ్యంకాదు. అక్కడ ఏమి జరుగుచున్నది? మనస్సు ఆత్మయందు లీనమగుచున్నది. మనస్సు లీనమగుట వలన శరీర చేష్టలు ఇంద్రియచేష్టలు అన్ని నశించినవి. అవి నశించుట వలన సుఖము కలుగుచున్నది. అంటే మనము శరీర చేష్టలు ఇంద్రియ చేష్టలు విరమించినట్లయితే సుఖము కలుగుతుంది. అని నిద్ర అందరికి ప్రబోధము చేస్తున్నది. ఆ విషయము తెలిసియు మానవులు అజ్ఞానవశమున, మనస్సు ఇంద్రియములు శరీరమునుగూడ వస్తువాహనములనుండి విరమించుటకు బదులు వాని యందు ఎక్కువగా ప్రవర్తింపచేయుచున్నారు. ఎంత ఆశ్చర్యము! తాము సుఖకారణము తెలిసియు అనుభవించియు తెలిసికొనలేక పోవుటకంటె అజ్ఞానము ఏమి యుండును ? ఎవడయితే ఈ విషయమును గుర్తించి తన మనస్సును వస్తువ్యాపారము నుండి విరమింపచేయునో అట్టివాడు - శంకరభగవత్పాదులు చెప్పినటుల

యోగరతోవా భోగరతోవా సంగరతోవా సంగవిహీనః

యస్యబ్రహ్మణి రమతే చిత్తం నందతి నందతి నందత్యేవ.

సర్వకాల సర్వావస్థలయందును ఆనందము అనుభవించుచునే యుండును. దీనికే నిత్యానందము అని పేరు.

ఇట్టి యానందమును అనుభవించుటచేతనే మన ప్రాచీనులు అధిక ధన సంపాదనకై వెంపర్లాడక జపతపాదులతో కాలము గడిపిరి. అది తెలియని మనము అజ్ఞానముచే ధనము వెంట పరుగెత్తుచున్నాము. ఎంత పరుగెత్తినను మనకు శరీరాయాసమేగాని సుఖలేశము కలుగదు. ఈ విధమయిన మనఃస్థితిని సంపాదించుటకు మంచివారి సాంగత్యము సద్గ్రంధపఠనము ఆవశ్యకము.



# మా యితర గ్రంథములు

1. మనువు - మానవధర్మములు. 28-00

నేటికిని మనము అనుసరించ తగిన ధర్మసూక్ష్మములతో నిండియున్న మను ధర్మశాస్త్రము, శ్లోకతాత్పర్యములు కలవు.

2. మన పండుగలు - మన కర్తవ్యము. 15-00

నిర్ణయసింధువు ననుసరించి వ్రాయబడిన డెబ్బదిపండుగల వివరణము గలదు. శ్లోకతాత్పర్యములు కలవు.

3. రామాయణ పారాయణ మాహాత్మ్యము.

రామాయణము పారాయణ చేయవలసిన విధానము దాని వలన కలుగు ఫలితములు కథారూపమున వివరింపబడినవి.

4. రామాయణము - (సంస్కృతమూలము) ప్రతిదినము రామాయణమును పారాయణ చేయుటకు తగినది.

5. బాలకాండ 1(

అయోధ్యాకాండ 30

అరణ్యకాండ 2..

కిష్కింధకాండ 30-0.

సుందరకాండ 50-(.

6. వైదికాచారములు - వివాహవ్యవస్థ (తెలుగువచనము) 5-(

వివాహమును గురించి మహర్షులు చెప్పిన విశేష విషయములు గలవు.

7. వేదాంత వ్యాసరత్నావళి. (తెలుగువచనము) 8-0(

మానవునకు ఇహపర లోకములందు అనుసరించతగిన ధర్మములు చెప్పబడినవి.

8. శంకరాచార్య చరిత్ర 8-00

నీతిశాస్త్రము 8-00

రామాయణ సుధాలహరి 10-00